The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

సంవత్సర చందారూ ౭
అర్థ సం॥ ,, ౩-౧౨-౦
విడిప్రతిక ౦-౧-౪

3342 హైదరాబాదు దక్కన్
Golconda Patrika. Hyderabad, Dn.

ఒకవారము తరువాత పాత్రికప్రతి కోరిన వారలకు పంపబడదు.

సంపుటము ౭ | శా. శ. ౧౮౫౪ అంగీరసనామ సం॥ర ఆశ్వీజ శు॥ ౧౩ బుధవారము 12-10-32 | సంచిక ౪౪

## జాతిసమితి

### శాంతిసాధన దుర్వినియోగము తన్నివారణోపాయము

నేనిప్పుడు ఉపన్యసింప దలచిన విషయము అతివిపులమైనది కాబట్టి జాతిసమితిని గురించి కొన్నివిషయములను మాత్రమే ప్రస్తావించి ముగింపవలసియున్నది

### ప్రస్తావన

మొట్టమొదట నేనొక సంగతిని మీకు తెలియ బరచవలసియున్నది. నాకు జాతిసమితి యెడల ద్వేషములేదు. పశ్చాత్తాపము చెందిన ప్రపంచము హృదయ శుద్ధికై చేసిన ప్రథమ ప్రయత్నము యొక్క ఫలమే యీ సమితియని నేను తలచుచున్న. అదియే నానాజాతులలో పరస్పర ప్రేమను సుస్థిర శాంతిని, నెలకొల్పుటకై ప్రపంచమున కొక యంత్రమును సృష్టించి యిచ్చుటకు ప్రథమ ప్రయత్నము ఆ యంత్రమును సరిగా నంకనిచ్చినయెడల అది యెంతమేలు నయినను సమకూర్పగలదు సత్పురుషులు ఆ యంత్రమును నడిపినట్లయిన, చిమశాంతులు తప్పక వర్ధిల్లగలవు

నేను జాతిసమితిని విమర్శింప బూనకొన్నను నాకు దానియెడల ద్వేషభావముండి కాదు. ఏ మహాశయులు ప్రపంచమునందు శాంత్యనరక్తుల ను వృద్ధిపొందించుటకు చేసిన యేర్పాటులనుగూర్చి నిరాసభావముతో యేమియు చెప్పజాలను ఒకవేళ మనము విమర్శ గావించినను మనయభిప్రాయము ఆ యంత్రమును చక్కగా నడిపించి, అది యెందుకొరకు స్థాపితమైనదో ఆ యుద్దేశ్యములు సఫలము లగునటుల యంత్రమును బాగుచేయుటయే.

### మనుష్యుని యుద్ధాభిలాష

ఇప్పుడు నేను జాతిసమితి స్థాపనకుపూర్వము యూరోపు చరిత్రమును వివరించెదను. ప్రపంచప్రారంభమునుండియు మనము యుద్ధముల నెరుగుదుము. మనుష్యునికి — వ్యక్తిగమైనను, సంఘముగనున్నను — పోరునందలి యభిలాష ప్రకృతి సిద్ధమై

# శ్రీ ఖాతి ప్రజల నివేదనము

## పైట్టైము

(ఒకవిలేఖరి)

యీగ్రామము నాగరకర్నూల్ తాలూకా లోచేరినది. శ్రీయువాంగీరసనామ సం॥ శ్రావణ శు॥ ౧౫ భానువాసరమున ఈగ్రామములో కొంతమంది సత్పురుషులు సమావేశమై బ్ర॥ ఖండవల్లి పాపశాస్త్రిగారి యధ్యక్షతక్రింద శివకేశవ గ్రంథాలయమను పేరనొక గ్రంథాలయమును స్థాపించి కొన్ని పత్రికలు తెప్పించడమునకు యనుమతించిరి. గ్రంథాలయస్థాపనార్థమై యొకభవనమును ప్రస్తుతము రామిరెడ్డి నారసింహారెడ్డిగారొసంగి. బ్ర॥ పల్లెల్లరామశాస్త్రిగారు కొన్నిగ్రంథములను చితముగా గ్రంథాలయమునకు దయతోనొసంగిరి. గ్రంథములసంఖ్య సుమారు ౫౦.

---

## కరీంనగరము

(ఒకవిలేఖరి)

ఉస్మానియ ఆంధ్రభాషానిలయము

ఈగ్రామమునందు ప్రస్తుతము వచ్చియున్న శ్రీరామవర్ధ్రఘటికల్ కంపెని ఒక్లారినారు తమయొక్క అద్భుత సీనరీలతో ప్రసిద్ధినాటకముల ప్రదర్శించుచు యిచ్చటివారలచే ఘనముగా పొగడబడుచుండిరి. వారిసమాజ నాట్యకౌశల్యముల కు తోడువారికిగల ఉదారబుద్ధియు మెక్కువ ప్రశంసనీయమైయున్నది. వీరు గడిచినశుక్రవారము ది ౧౮-౧౨-౪౧ నాడు యిచ్చటి భాషానిలయము పేర సతీతులసీ అను నాటకమును అత్యంతానందకరముగ ప్రదర్శించిరి. యీ ప్రదర్శనమునకు యీ గ్రామపౌరులు తమకుగలఅభిమానముచే యెక్కువగా సహాయపడిరి. యీప్రదర్శనమునకు చేకూరినఆదాయములో సగము రూ ౬౫ గ్రంథాలయమునకు యివ్వబడెను. యిదియునంగాక వెంకోబరావు మేనేజర్ గారును మరియు గోపాల్ రావుగారును వ లక్ష్మీబాయి వ నీలవేణి బాయిగార్లును తమతమగానాట్యములచే ప్రేక్షకుల కత్యంతోత్సాహముకలుగ జేసిరి. ఈ నాటక సమాజము యెల్లప్పటికిని వృద్ధిలోవుండ ఇట్టిసత్కార్యములయందు సహాయము చేయగలరని పరమాత్ముని ప్రార్థనచేయుచున్నాము.

రెండవది ఆదాయము సమకూర్చుటలో ఈ దిగువసభ్యులు చాలాసహాయముచేసిరి. వారికిని నాటకసమాజమువారికిని నిలయపక్షమున కృతజ్ఞత వెలిబుచ్చనయినది.

౧. మృగేశంముదలియారుగారు, ౨ నరసింహంగారు, ౩. ఆ. కృష్ణమూర్తిగారు, ౪. చొక్కారావుగారు, ౫. కిషన్ రావువకీలుగారు, ౬. రాజవీరు వకీలుగారు, ౭. అప్పయ్యశాస్త్రిగారు, ౮. లక్ష్మీనరసింహారావు, ౯. జే. పి. రత్నంగారు.

## కరీంనగరము

కరీంనగరమునందు ప్రతిజాతివారును తమతమ జాతివిషయము సంఘము లేర్పాటు చేయవలయుననియు ఎక్కువ ప్రోత్సాహించబడుటకు తమపత్రికయొక్క మహాశ్యమేయని వేనుచెప్పజాలము. చదువుటకు వ్రాయుటకుగూడ ఆదిహిందూ జాతిలో నేర్పనివారికి మేలుకొలుపు జరుగుచున్నది. గనుక తమదయ అందరికన్నా మాలమాదుగులపై ఎక్కువగా యుంచగలరు. ఇచ్చటి పోలీసు మొహతమీముగారగు శ్రీమాన్ నారాయణరెడ్డిగారు మావిషయము అందరితోపాటు "ఆత్మవత్సర్వభూతాని" యనునట్లు దయాదాక్షిణ్యముగలిగి మొఖామే హోదేదార్లలో ఓంనమోనారాయణ యనునట్టు ప్రతివక్తిచే మెప్పుబడయుట కెంతయో సంతసించి మాస్వసయిటి వారందరి తరపున నాయొక్క పూర్వహృదయముతో ప్రార్థించుచున్నాడను.

ఈ సభయందు జేరుటకు నద్యుక్తులైన అరుంధతీయకులనాయకులు ఎల్ గందల్ నవర్ పెద్దమాదుగులు:— అడ్డూరి రాములు మేస్త్రీపుటారులు

అడ్డూరి పెద్దరాజాలు వ చిన్నరాజాలు

వగైరా ౨౦ మంది సంతకములు కలవు

ఇంకా ననేకమందితో సభలు జరుగుచున్నదానికి గాను వారివారి శక్త్యానుసారముగా యిచ్చు ధనసహాయముయొక్క జమఖర్చులు జాబితా ప్రకారము దస్తరము తనిఖీచేయుటకు ప్రతినారు హక్కుదారులైయున్నారు కావున మాకు చేయూతనొసంగు దేశాభిమానులందరికి వేనవేల వందనములు. ఇట్లు

ప్రచారకులు

## జాబులు

అరుంధతీయ జాత్యున్నతిసభ అన్యక్షులు
హైద్రాబాదు వారికి

అయ్యా:—

యీప్రాంతమందలి మా జాతివారలకు కలుగుచుండెడు అష్టకష్టములు చెప్పనలవిగాకుండ యున్నది:— మీరు హైద్రాబాదున మావిషయము చేయుచుండెడు పాటునకు మేము నిండు కృతజ్ఞతలు చెల్లించువారలము.

యిద్విషయము ఆదిమాంధ్రకులరత్న భూషణులగు శ్రీయుత్ పీసరివీరన్న పంతులుగారు పలువిధముల తలపెద్దలతోను కులపెద్దలతోను మాట్లాడుచు పీరు సాయపడుచున్నారు. కాని వారికి సదర్ సంఘమునుంచి చేదోడు వాదోడుగా పనిచేయుటకు నొక అరుంధతీయ ప్రచారకున్ని నియమించేసి పంపించినయెడల ఆ ప్రచారకుని జీతము వగైరాలు వీరన్న పంతులుగారు యింతెజాం చేయుదురు కావున మీరు మాయందు దయయుంచి సాధ్యమైనంత తొందరలో పంపించగలరు. యిందులోనెట నొకమనవి పత్రము ఆంధ్రజన సంఘము గౌరవకార్యదర్శిగారికి పంపుచున్నాము మీరుమీరుకలసి మాకు కావలసిన సహాయము ఏర్పాటు చేయగలరు. ప్రస్తుతము మా "వెట్టి చాకిరి" విషయమైన గ్రంథములన్ని వి. పి. జరియాన పంపించగలరు.

ఇట్లు విన్నవించు విధేయుడు
బొరగళ్ళసర్వడు పెద్దమాదిగ
యింకా అయిదుగురు సంతకములు
సాంబాబాదు

---

మ. రా. రా. శ్రీ అరుంధతీయ జాత్యున్నతిసభ (హైద్రాబాద్) అధ్యక్షులు
గారికి పీసరివీరన్నా పంతులు
ప్రచారకులుద్వారా

అయ్యా:—

మాయొక్క కష్టనిష్ఠూరములు లోకములో నెవరికిని తెలియనివికావు గనుక ఈ కరీంనగరం జిల్లా ఎల్లందల్ మాదిగలము ఈ ఇలాకాయందేటికి పెద్దమాదిగులమను నదర్ చౌదరీలము మాచేతిక్రింద యిచ్చటచ్చట కొంతమంది కులపెద్దలు యున్నప్పటికిగూడ పూర్వమునుంచి మాపెద్దలు సర్కారువారికిని స్వజాతీయులకు మెప్పుబడసి పొందిన రాగిశాసనములుగూడ మావద్దయున్నవి. తెలియుగలరు.

ప్రస్తుతము మాజాతివిషయము మనరాజగారు యిచ్చిన వరములనగా వెట్టిచాకిరి విషయమైన ఫర్మానా యును ఖాయిదా ద్వారా హోదేదార్లకు మామందు దయయుంచి అచ్చువేయించి కొన్ని వందల గష్తీలు యిచ్చినయెడల మాజాతివారలకు మాకులస్థులతో పంచిచుకొని మేమందరము తోడిమానవులతో పాటుగా బ్రతుకుచు మన నైజాముప్రభువుగారినిన్ని దేశాభిమానులను మాపిల్లపిల్లల పర్యంత సదా మ్రొక్కుచుండగలము. చిత్తగించకర్తలు: ఇట్లు విధేయులు

౫ మంది సంతకములు

---

## దీవాలాతీసిన భారత ఇండస్టిల్ కంపెని

అయ్యరుగారేమి చేయుచున్నారు?

అయ్యా!

పత్రికాధిపతిగారూ వై అంజయ్య బి. ఏ. గారను వారొకసి ఒక కంపెనీని లేవదీసి మాతో కొన్ని వాటాలు ఖరీదు చేయించెను. కొంతకాలమున ఆ కంపెనీని మూసివేసిరి. దీవాలాతీసెను. మానే ఆ వచ్చిన పైకమేదో మాకు పంచిపెట్టండి అని మీ పత్రికలో నేను వ్రాసితిని. అప్పుడునకుకే అయ్యరో నటరాజ అయ్యరో ఆయన పేరో సరిగా జ్ఞాపకములేదు ఆయన దానికి పెద్దరికము కట్టుకొని మాకంత నోటీసులిచ్చెను. మీ తరఫున యింకా కొన్ని రూపాయిలు వసూలు కావలెను. పంపండి లేకుంటె మీపైన దావా చేస్తాము అని బెదిరించెను. నేను కొంత యింటిలేనప్పుడు అగుటచే! దావా అనగానే భయపడి నాలుగు రూపాయిలు (నాజమ్మా వుండినవి) మని ఆర్డరు చేసి అయ్యరుగారికి పంపితిని. మొదటివి అసలే పోయే. తర్వాత పంపినవి అందులోకే పోయెను. పంపనివారిదే లాభము. ఆశకుపోయి పంపితే పోగొట్టుకొంటిని. ఏమండీ అయ్యరుగారూ! ఇట్లా చేస్తే ఏమిఅంటె అందరుయిస్తె పంచిపెట్టుతా అన్నారు. అందరు యియ్యకుంటె వారిపైన దావా చేయవలె లేకుంటె మళ్లి ౧౫ దినాలు వాండ్లకు నోటీసుయిచ్చి పూర్తిగా యిచ్చినట్లు నావంటివాండ్లకే ఉన్న పైకము పంచిపెట్టుతానని చెప్పి అలా గైన చేయవలె. దేవాలనోట్లో మన్ను రాతసులనోటో కు మన్నా అన్నట్లు గుమాస్తాలు గార్డులు అన్నే సరిపోనా? చెప్పండి! వున్న కేమి దొరకకుంటె ఉన్న పైకం యెవరిది నా లో పత్రికాధిపతిగారూ! దయచేసి యిది ప్రకటించి ఉపకారం కట్టుకోండి.

ఇట్లు ఒకవాటాదారు.

## మంత్రసాని తనము.

బాలికల ఉన్నత పాఠశాలవారికి సూచన

బాలికఉన్నత పాఠశాలలో సంగీతము కూడ నేర్పించుతున్నదని సంతసించితిమి. కాని సంగీతము కన్న ధాత్రీయవిద్య చాల ముఖ్యము. సంగీతము నకు చింతకాయలు రాలకుండవచ్చును కాని, మంత్రసానితనము లేకున్న మన దేశములో శిశువులు రాలిపోవుట తథ్యము. మేయో అమ్మాయి యీవిషయమై మనలను చాల దూషించినది. ఆ కన్యక వ్రాసిన వ్రాతలలో కొంత సత్యమున్నది. ఏమియు తెలియని మూఢురాండ్రను, పశుతుల్యులను, దుర్గంధయుక్తులు నగు కవ్యములబోలిన వారును మన దేశమంతట మంత్రసానలుగా పల్లెలలో పని చేయుచున్నారు. మన దేశములో ఆయువుగాయలు ౨౩ సంవత్సరములు. మన హైదరాబాదు రాష్ట్రములో నూటికి ౫౦ మంది శిశువులు ప్రతియేటను చచ్చుచున్నారు. కావున మేము సూచించునదేమనగా హైదరాబాదునగల బాలికల ఉన్నత పాఠశాలలయందు మంత్రసానివిద్యను రెండు పాఠము కంఠస్థమైనను దినమొకగంటయైన నేర్పింపవలెను. ఈవిషయమై హైదరాబాదు ఉస్మానియా హాస్పిటల్ నుండి మంచి మంత్రసానిని తెనుగువచ్చినదానిని వచ్చునట్లు ఆస్పత్రివారిని ప్రోత్సహము బడసి యేర్పాటుచేసిన బాగుండునని సూచించుచున్నాను.

ఇట్లు (ఒకరు)

## అంధ్రహరిజన సంఘము

శ్రీయుత డాక్టరు: యస్: రామకృష్ణారెడ్డి గారు, స్వవిరచితమైన "ప్లేగుతేక బొబ్బరోగము" అను లఘుపుస్తకముయొక్క వంద ప్రతులు, పైసంఘమున కుచితము దయచేసినందులకు రెడ్డిగారికి పైసంఘముపక్షమున కృతజ్ఞత పూర్వకమైన వందనములర్పించుచున్నాను.

ఇట్లు రావి. నారాయణరెడ్డి
కార్యదర్శి,

## మహాత్మా గాంధి

### అన్యాయమునకు ప్రతిఫలము

అణచిబైచినందులకే దాసత్వము

పంచములకై నాశేతనగునంతవఱకు పాటుపడుచున్నాను.

నానమ్మికప్రకారము హిందూమతమునకు అస్పృశ్యతకు సంబంధములేదు. హిందూమతమును శరీరముపైనది కణితివలెనున్నది. దీనిని సర్వవిధముల పాటుబడి తీసివేయవలయును

మహాత్మగాంధిగారు, శ్రీ॥ శ్రీ॥ ౧౯౩౨ అక్టోబరు నెల ౨౭వ తేది యంగుఇండియాపత్రికలో పంచములగురించి క్రిందసూచించిన కొన్ని యమూల్యాభిప్రాయము లిచ్చియున్నారు.

స్వామివివేకానందగారు పంచములను అణచివేయబడ్డ సంఘమువారని పిలచెడివారు వారిచ్చిననామము చాల బాగుగనున్నది. మనము వారిని యణచివైచితిమి కనుకనే మనము అణచివేయబడినాము. గోఖలేగారు భారతీయులను ప్రభుత్వదాస్యులనెడివారు స్వయంకృతాపరాధమువలన ఫలితము న్యాయదేవతాప్రసాదముగ మారిపోయినది.

ఒకవిలేఖరు ఆగ్రహభావముతో మనసు కరగించునట్టి యుత్తరము వ్రాసెను. నేను అస్పృశ్యులగురించి యేమి చేయుచున్నానని యడిగెను ఆంగ్లేయులను బాధించుటకు ముందు మనము మనరక్తమువలనఁ కలిగిన చేతులను శుభ్రపఱచుకొనకూడదా? యని ప్రశ్నించెను.

ఇదిచాల ఉత్తమప్రశ్న

"సహవాసిత్వమా? అన్యమతాకర్షణమా" దాస్యశేషపు యొక్కటియైనను అణచివేయబడినవారిని వ్యాక్యములనుండి విడదీసిన నేను వాస్వేచ్ఛకైన పాటుబడక వారికి స్వేచ్ఛ నొడెయిప్పించెదను. కాని యిసకట్టవాళ్ళను, హానకరసరియను కొర్కెలేనైనను చేయుటకు హక్కులేదు, విదేశస్తులను పడేదిమట సరియని నావస్త్రకము కాని యిట్లు చేయుటకు నాకోకట్టియునులేదు. మహాత్మ సత్యసత్తిగాక్కు తుక్కునేకొసుగానో నాకక్షిగలన్నహోదాయనను ఈ భారతీయుఁనానే పాడుగొనియోయని పోటకుంటు స్వస్థమై యున్నది. కొందరాంగ్లోలాగు చేయుటకు స్వేచ్ఛయేయున్నది. న్యాయమగు శాసనాధికారమే నాపొందిన హైందవుల యమిర్యాదనాష్టలకు ప్రక్రియగ పరిపులకై ప్రత్యేకభావులను త్రవ్వించి యెన్నిసౌ మంచిసౌకర్యాలను కట్టించెదిచాను. ప్రపంచమునకు బహిరంగము విశ్వేశ్వరేనై ఏకోయతుగ. తీసివేసు నాయేమిపట్లెబ్బుట్టే నికట్టిపోయినే నేను గోచియుండగలను.

ఆంగ్లేయులకు పంచములవారి దాస్యత్వము విడిపింపబడవలసినదేన? ఎన్నటికినిలేదు! నాకర్తవ్యమును నేను పాటుపడినాను. నాపంచమోద్ధరుణకై సర్వవిధముల పాటుబడుచున్నాను.

### తప్పుడుత్రోవ

పంచములకై మూడుమార్గములు కలవు వారికి యేదోపికలేక దాస్యుల ప్రభుత్వయాదరణ నక్కై యాశించవచ్చును వారికి ప్రభుత్వపోషణము లభింపగలదుకాని వారుకోరెడి కడాయినుండి నిప్పులోనే పడియెదరు. నేడువారు దాస్యులకు దాసులైయున్నారు. ప్రభుత్వసహాయ్యమును బడసిన మొదల వారిని బాధ బంధువులకైన సహాయయనుటకు పురికొలుపబడుదురు. సువర్ణప్రదర్శనులకు లోబడుటకుబదులు హారెసున్నాత్తులగుదురు. మహమ్మదీయులు ప్రయత్నముచేసిరి కాని విప్లవోజాలకై హారమీననది. పూర్వము కన్న మిగుల చెడిపోయిరి. సిక్కులనూడ నిదే మార్గ చెడిపోయిరి. భారతదేశములో సిక్కులకన్న కూడ అసంతృప్తికరమైన జాతి వేరె కనబడదు. కనుకనే ప్రభుత్వసహాయము యొకమార్గము కానేరదు.

### అసాధ్యమార్గము

రెండవమార్గము హిందూమతమునువిడచి మహమ్మదీయులకో క్రైస్తవమతమును స్వీకరించుటకై ప్రపంచయభివృద్ధికై పరమతావలంబము సరియగునని నాకేలాటి యనుమానము లేకనే దీనికి సలహా చెప్పెడివాడను. కాని మతము ఆత్మకు సంబంధించినవిషయము. శారీరకకష్టము లెన్నియైనను వొకరి మతమును విడిపింపజాలవు. హిందూమతమే పంచములపై ఆ మానుషచ్ఛవహారముల జేయింపజేసిన పక్షమున నిరాకరించుట నాదేమి నాబోటివారిదేమి ప్రథమధర్మమై యున్నది. మేము మతమును పవిత్రనామముపేరిట చెడుకార్యములజేయ సహించి క్షమింపలేము. అస్పృశ్యతమతమునకు సంబంధించిలేదు. కాని యది హిందూమతముశరీరముపై నొకకణితివలె నున్నది. సర్వప్రయత్నములవలన దానిని తీసివేయవలయును. హైందవసంఘ సంస్కర్త లెందరోకలరు. వారు తమజీవితముల నిదోషముయొక్క రూపుమాపుటకై దారపోయుచున్నారు. కనుక పరమతావలంబన మస్పృశ్యులకెన్నటికిని సరియగుమార్గము కానేరదు.

### సరియగుమార్గము

తుదకిక మిగిలినది స్వప్రయత్నమే వీరికి ముఖ్యాధారము మరియు పంచమేతర హిందువుల తమయాదరపూర్వకమునగాక ధర్మవిధిగజేసెడి సహాయ్యమే ముఖ్యసహాయ్యము ఎంతవఱకైతె ముఖ్యకష్టముల నివారణకాదో అంతవఱకు పంచములు హిందూమతమునకు భిన్నముగనైన గడచి హిందువుల సర్వసంబంధము విడనాడవచ్చును. ఇది మంచిసిక్షణపొందిన వ్యక్తులను కాని నాకు తెలిసినంతవఱకు పంచములలో అసహాయోద్యమద్వార జయముకలిగింపజేసె నాయకుడొకడు కానరాడు కనుక ఉత్తమమైన మార్గము పంచములు జాతీయసంచలనము పాలుగొనుట

## అపూర్వమైన యాకలి

గడియారమును కత్తిని మ్రింగుట

గ్రీనిచ్ వద్ద నావికుల వైద్యశాలకు తేబడిన ఒక నావికుని యక్సరేతో పరీక్షింపగా వానికడుపులో గొలుసుతోటి గడియారమొకటియు కత్తి యొకటియు కనబడెను.

ఆసుపత్రికార్యదర్శి తానంతకుముందెన్నడు యిటువంటి కేసును చూడలేదని చెప్పెను.

"వారము క్రిందట సముద్రముపై ప్రయాణముచేయుచున్నప్పుడు నిరుత్సాహమువల్ల ఏమియుతోచక అవస్తువులను మింగితి" అని నావికుడు చెప్పుచున్నాడు అందువల్ల వానికేమియు బాధకల్గుటలేదు.

అయినను వానిని చూచిన స్పెషలిస్టు డాక్టరు ఆవస్తువులను వెలికి తీయునట్లు యొప్పటికైనను ఆపరేషను చేయనున్నారు.

## 'డాక్టర్ మూర్తి'స్

ఆరోగ్యము కొరకు "జీవసుధ" అనుభవమే కారణము మోసముకాదు!

శుక్లనష్టము ప్రమేహము (గనేరియా) బహుమూత్రము క్షయ మలేరియ మొదలగు మేహకారకములచేగాని రక్తము సల్పబడి రక్తదోష్టత. ధాతుపుష్టి తగ్గినను దేహమనోబలములు నిరసించినను నాంపత్య సుఖానురాగ శక్తి లేకపోయినను, అట్టివారికి అత్యద్భుతమగు బలమునొసగు ఔషధము "డాక్టర్ మూర్తి, స్ జీవసుధయే" దీని నసేకులు పరిశోధించియున్నారు. జీవితాశ విరాశచేసియుండు స్త్రీ బాల వయోవృద్ధులు మా జీవసుధను సేవించి జీవకష్టలను హరించుయున్నారు. వెల ౧ పౌను రు ౪౦౦

## ప్రసాదిక

(స్త్రీల పాలిటి కల్పతరువు)

బుతుశూలలు, బుతుబద్ధము, ఎరుపు, కుసుమవ్యాధులు మానును రక్తము శుద్ధిచేసి గర్భాశయమును చక్కపర్చి గర్భధారణ యోగ్యమగును. అనేకులువాడి సౌఖ్యమును పొందిరి.

వెల పౌను రు ౪౦౦ ౦౪ పౌను రు ౨౪౦

### మహాభృంగామలక తైలము

మెదడును చల్లపరచి శిరోవాతములను పోగొట్టును.

సీసా రు ౧౦౦ మహాదీఘల రసాయనం:— సర్వమైత్యనివారిణి. వెల సీసారు ౧౦౦ అర్శమొలారిష్టం:— అన్నివిధములైన అర్శమొలలు గ్యారంటిగా హరించును వెల ౦౪ పౌను రు ౨౦౦

గనేరియా స్త్రీల కుసుమ బహుమూత్ర అశ్మరి క్షయ అరికమొల శుక్లనష్టము శూలగలవారికి గ్యారంటి ఔషధము లివ్వబడును. ఒకసారి వాడిన తెలియును.

డాక్టరు కృష్ణమూర్తి, శ్రీకృష్ణకుటీరము (హనుమకొండ)

సోల్ యెజంట్సు భవాని కంపెని నల్లగొండ (నిజాం)

సమస్తమయిన సంస్కృతాంధ్ర గ్రంథములు ఔషధములు సామానులకు మాకు వ్రాసిన పంపగలము. మా పూర్తి కేటలాగు కోరినవారికి ఉచితము గా పంపబడును.

